# దైవ ప్రార్థన

~~~/o/~~~

శ్రీ నిలయైకసప్తగిరిశేఖరసంస్థితిఁ గన్న నీకు నా
నానవరత్నరాసుల ఘనంబుగ నిచ్చెడు శక్తి లేదు; మ
న్మానసవారిజోదితసముంచితభావమరందపూరితా
మ్లానమనోజ్ఞపద్యకుసుమంబుల నిచ్చెద, వేంకటేశ్వరా!

# గురుస్మరణ

ప్రత్యక్షంబగు తిక్కనార్యుని మహోపాధ్యాయు, విద్వత్కవి
స్తుత్యగ్రోభయసాహితీధనుని, విజ్ఞున్, సత్కవిత్వోదయ
ప్రత్యాశాలతికాసమాశ్రయుని 'దుర్భా'వంశసంభూతు ని
ష్ప్రత్యూహార్థము గొల్తు మద్గురుని సుబ్రహ్మణ్యవిద్వన్మణిన్.

స్మరియింతు భక్తి నస్మ
ద్గురు, సుబ్రహ్మణ్యశర్మ, దుర్భాన్వయు, నె
వ్వరికృప మముఁ గొంట్లను బ
ల్వీర సత్కవితారితఁసువులఁ గావించెన్.


~~~

# కృతిభర్తప్రశంస

మునుపుమహిన్ హిరణ్యకశిపుం దెగటాఱిచి లోనిప్రేవులం
గొని నులివెచ్చనెత్తురును గ్రోలె నుదగ్రనృసింహమూర్తి; నీ
వనినఁ బరోపకారవిహితాత్ముఁడవై నిజరక్తధార లి
చ్చిన జగదేకవీరుఁడవు శ్రీపుర వేంకటనారసింహమా!

"తొల్లి శిబిచక్రవర్తి సంతోషమొప్ప
మేనికండల ఖండించి దానమిచ్చె"
ననుచుఁ బౌరాణికులు గాథ లల్లినారె
గాని, యాదృశ్య మెవ్వాఁడు గాంచినాఁడు?

నీవు రక్తమిడుట నిక్కంబు; మేమెల్లఁ
గన్నులారఁ గనిన కారణమున—
భాగ్యభోగ్యములను వాంఛ సేయని నీకు
వసుధ, హరిచిరాయు వొసఁగుఁగాత!

ఎందఱు లేరు త్యాగులు మహీతలమందు – సువర్ణధాన్య స
న్మందిరవస్తువాహనధనక్షితిరాజ్యపురాదులన్ మహా
నందముతోడ దానమిడినట్టి మహాత్ములు? శ్రీనృసింహ! నీ
చందమునన్ స్వరక్తము నొసంగిన దాతలు ధాత్రి లేరుగా!

ముప్పదిమూఁడుమాఱులు ప్రమోదముతో రుధిరంబునిచ్చు చే
యొప్పని నిల్పఁ బోక, నెదియో యొకసాకును బెట్టి యేరికిం
జెప్పక యే మఱొక్కపరిఁ జిక్కనినెత్తురు ధారవోతువో
యప్ప! యదృష్ట మశ్రుత మహా! భవదీయ విశిష్టకృత్యముల్.

శ్రీపుర వేంకటనరసిం
హా! పుణ్యాత్ముఁడవు నీవ : యటుఁగాదేనిన్
నీపేరున వేల్పు లిరువు
రీ పగిదిం గూడియుండు టెట్లగునొక్కో!

లోకము చెడ్డదయ్యెఁ; బ్రజలుం దమధర్మము నిర్వహింపఁగాఁ
బోక స్వకార్యమగ్నులయి ప్రొద్దులు పుచ్చుచు నున్నవారు : నీ
వీకరణిన్ బరోపకృతికే ములుసూపుటఁ జూచి — త్వచ్ఛిలా
స్తోకమనోజ్ఞవిగ్రహము స్తూపములన్ భువినాటకుందురే!

వ్రాయఁగావలయును సువర్ణాక్షరముల
సత్కవీంద్రుండు భవదీయసచ్చరిత్ర;
అట్లుగాకున్న విబుధుల కాదరంబు
లోటుగాదె సారస్వతలోకమందు?

చెక్కఁగావలయును శిల్పి చిత్రగతుల
శాశ్వతముగ నీదుచరిత శాసనములఁ
గానిచోఁ గళాకారుల గౌరవంబు
లోటుగాదొకో సత్కళాలోకమందు?

పాడఁగావలె గొంతెత్తి పాటకుండు
దివ్యమగు నీదుచరితంబు భవ్యరీతి;
అటులఁగాఁ జేసి బ్రతుకు గాయకులకెల్ల
లోటు కాఁబోనొక్కొ సంగీతలోకమందు?

గురుశిష్యులంచుఁ, పటాలమంచు, నవనవ గానాలాపములు, నిత్యనూతన మొ
హనకీర్తనములు, స్వరజతుల ముచ్చటల, బుఱ్ఱుందు ప్రాణంబులకా
వినుచుండగాని సదాత్మనంబునఁ న్యసనమండలంబందు ని
త్యసంతానము కావ్యము కటిరమ ప్రాతఃగూచల ప్రాయమై.

సప్తసంతానములను బ్రతిష్ఠించి
ఖిలము గాకుండు నట్టిది కృతియ గాన
శాశ్వతయశః పరిమళాస్పదమదియు
కావ్యకుసుమమాల నీ కలంకారమగుత.

ప్రాంత మిత్రుండ నీకు నెప్పటికైన
నీదు పేరు సార్థకంబుగా నిల్పుకొనుటకు,
శ్రీనృసింహుని స్తోత్రంబు చెల్మి గల్మి
అంకితంబుగ నిచ్చెద నయ్య! నీకు,

# విజ్ఞప్తి

నెల్లూరు కలెక్టరాఫీసులో నేను హుజూరు శిరస్తాదారుఁడుగా పని చేయు కాలమందు శంకరాచార్యుని 'భజగోవిందము', 'కనకధారా స్తవము' లను కృతుల నాంధ్రీకరించి పోతనార్యకృతభాగవతములోని 'శ్రీరామ చరిత్ర'కు విపులవ్యాఖ్య వ్రాసి ముద్రింపఁగల్గితిని. శిరస్తాదారు నుద్యోగము మూఁడేండ్లు పూర్తియైనతోడనే విశ్రాంతికొఱకు ఒకనెల సెలవుపెట్టి మచిలీపట్టణమునకుఁ బోయి యచ్చట వాల్మీకిరామాయణము యుద్ధకాండము లోని "ఆదిత్యహృదయము"ను దెనుంగుచేసి తిరిగి నెల్లూరునకు వచ్చి ప్రస్తుతము శిరస్తాదారునిపీఠము నధిష్ఠించియున్న శ్రీ భట్టిప్రోలు లక్ష్మీనారాయణగారియొద్ద ప్రస్తావవశమున నా యాంధ్రీకరణము సేఁతనుగూర్చి ముచ్చటించితిని. వారు వెంటనే "నీవు శంకరాచార్యుని లక్ష్మీనృసింహస్తోత్రమును సహితము ఆంధ్రీకరించినచో సమంజసముగా నుండును; ఆ స్తోత్రము బీజాక్షరమహిమాసమన్వితము కాఁబట్టి తత్పఠనచేఁ బెక్కండ్రు ముక్తి నొందఁగల"రని వాక్రుచ్చిరి. శ్రీ లక్ష్మీనారాయణగారు నాకుఁ జిరకాల మిత్రులు; సహోద్యోగులు; అన్నింటికంటె నార్జవసంపన్నులు. అట్టి నెయ్యుని సూచనను గౌరవించు తలంపుతోను, శంకరాచార్యుని కృతుల మీఁది యభిమానముచేతను ఈ స్తోత్రమును 'వావిళ్ళ'వారియొద్దనుండి తెప్పించుకొని ఒకవారములో సర్వేశ్వరునికృపచేఁ బూర్తిచేయఁగల్గితిని. దీనిని పూజకు నర్హమగురీతి 'మంజరీ' ద్విపదలో నాంధ్రీకరించితిని. ఈ స్తోత్రమును దెలుంగున ననువదించుటకు మూలకారకులైన శ్రీ లక్ష్మీనారాయణగారికి నా వందనసహస్రములు.

ఈ పుస్తకమునకు విపులవ్యాఖ్య రచించిన శ్రీ రాచగుండ్ల చెంచలరావుగారికిని, అందందు సవరణలు సూచించిన నా సారస్వతమిత్రులు శ్రీ భట్టారం మల్లికార్జునంగారికినిఁ గృతజ్ఞుఁడను. త్వరలో నే నాంధ్రీకరించిన 'ఆదిత్యహృదయము'నుగూడ వ్యాఖ్యతోఁ బ్రచురింపనున్నాఁడను. ఉద్యోగ సూర్యచండాంశువులచే మాఁడిపోవు నా సారస్వతవృక్షమునకు

శ్రీ మల్లికార్జునంగారు పుష్కలవృష్టి కురిసి చిగురింపఁజేయు జీమూతుఁడు. శ్రీ నృసింహస్వామి నా యీ మిత్రులకు నాయురారోగ్యములఁ బ్రసాదించుఁగాత!

నా యీ కృతికి భర్త శ్రీ శ్రీపురము వేంకటనరసింహారావు, బి.ఏ., డి.పి.ఈ., బి.యల్., గారు; వీరు నెల్లూరుజిల్లా వేంకటగిరిపుర వాస్తవ్యులు. నేను నా బాల్యదశలో వేంకటగిరిలో శ్రీ రాజా వెలుగోటి ముద్దుకృష్ణ యాచేంద్రబహద్దరువారి పాఠశాలలోఁ జదువునప్పుడు వీరిపరిచయ మేర్పడినది. వీరిని ఆబాలగోపాలము 'నర్సు' అని పిలుచుచుండెడువారు. ఒక బీద కుటుంబమున వీరు తే 10-12-1905 దిన జన్మించిరి. నెల్లూరు వి.ఆర్. కళాశాలలోను, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలోను, మద్రాసు త్రివేంద్రము 'లా' కాలేజీలలోను వీరు పఠించి ప్రతి తరగతిలోను రెండవక్లాసులో (2nd class) ఉత్తీర్ణులైరి. మద్రాసు హైకోర్టులో తే 5-3-1935 దిన అడ్వకేటుగా ప్రవేశించిరి.

వీరికి వ్యాయామక్రీడలలో నభిరుచి మెండు. వివిధములగు నాట పోటీలలో వీరు రమారమి నూఱు రజతపాత్రలను, అసంఖ్యాకములగు బంగారు పతకములను బడసిరి. 1929-వ సంవత్సరములో మద్రాసు 'ప్రెసిడెన్సీ ఒలింపిక్' క్రీడలలో 'చాంపియన్‌షిప్పు' నొంది విఖ్యాతిగాంచిరి. వీరు మద్రాసు వై.యమ్.సి.యే. కాలేజిలో 'డి.పి.ఈ.' అను 'డిప్లమా' నొందిరి.

నెల్లూరు జిల్లాలో— National War Front నందు మండలోపన్యాసకుఁడుగను (District Lecturer), ద్వితీయ ప్రపంచయుద్ధకాలమందు 'రిక్రూటింగ్ ఆఫీసరు'గను (Recruiting Officer), 1948-50 సంవత్సరములలో కేంద్రప్రభుత్వమువారిపక్షమున 'వెల్ఫేరు ఆఫీసరు'గను (Welfare Officer) పనిచేసియుండిరి. 1951వ సంవత్సరమునఁ బ్రమాదవశమున 'జీపు'కారునుండి పడి దెబ్బతగిలినందున నుద్యోగమునుండి విరమించి విశ్రాంతిగొనిరి. వీరు ఉద్యోగకాలమం దొనర్చిన నిరుపమానసేవను గొనియాడుచు ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు తే 24-5-58 దిన వీరికి నొక 'Sanad'ను బ్రసాదించిరి.

శ్రీ పురము వేంకటనరసింహారావుగారు సంఘసేవ యొనర్చుటలో అద్వితీయులు. వీరు 'ఇండియన్ రెడ్ క్రాసు సొసైటీ'లోను, పసిబిడ్డల క్షేమాదుల నరయుటకు నేర్పడిన ఇండియన్ కౌన్సిలులోను, ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన 'ఫుట్ బాల్ అసోసియేషన్'లోను జీవితసభ్యులుగా నున్నారు. 1949-వ సంవత్సరమునుండి 'డి.యస్.యస్.ఏ. బోర్డు' (D.S.S.A. Board)లోను, 1944 మొదలు 1959 వఱకు వి.ఆర్. కళాశాల కమిటీలోను సభ్యులుగా నెన్నుకొనఁబడిరి.

తోడిమానవుల ప్రాణముల రక్షించుటకొఱకు వీరు ఇప్పటివఱకు ముప్పదిమూఁడుమారులు 'రక్తదానము' నొసఁగిన వీరమూర్తులు. ఈ మహాత్యాగము నభినందించుచు వేంకటగిరి పంచాయతిబోర్డువారు వీరికి సన్మానపత్రి మొసఁగి ఒకవీథికి 'రక్తదాత నరసింహారావువీథి' అని పేరుపెట్టిరి. రేపల్లె-రాజమహేంద్రము మున్సిపాలిటీవారు, నెల్లూరు-రేపల్లె న్యాయవాది సంఘము (Bar Association)వారును—వీరిని గౌరవించి సన్మానపత్రముల సమర్పించిరి. 'న్యూఢిల్లీ'యందలి 'ఇండియన్ రెడ్ క్రాసు సొసైటీ'వారు 'certificate of merit' నిచ్చి బహూకరించిరి. నెల్లూరు రక్తదాన భవనములకు పునాదిరాయి వేయునప్పుడు కీర్తిశేషులు శ్రీ కళా వేంకటరావుగారు వీరికి బంగారుపతకము నిచ్చిరి. ఏతద్భవనప్రారంభోత్సవసమయమున శ్రీ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు రజతపాత్రను కానుకగా నిచ్చిరి. వేంకటగిరి ప్రాంతవిద్యార్థిసంఘము వారు ఒక బంగారుపతకము సన్మానపత్రమును, రాజమహేంద్రములోని ఫుట్ బాల్ సంఘమువారు వెండిషీల్డును సన్మానపత్రమును వీరికి సమర్పించిరి. నెల్లూరు వి.ఆర్. కళాశాలవిద్యార్థులు తే 11-11-59 దిన వీరికి 'రక్తదాత' అను బిరుదము నిచ్చి గౌరవించిరి.

వీరు ఫుట్ బాలుఆటలో Refreeగా అంతర్మండలయశస్సును గాంచియున్నారు. మానవసేవయే మాధవసేవగాఁ బరిగణించి రక్తదానము చేయునట్లు వీరు ప్రజలలోఁ బ్రబలప్రచారము చేయుచు కాలము పుచ్చుచున్నారు. ఇప్పటివఱకు గుంటూరు, కృష్ణా, గోదావరిజిల్లాలలో వీరు పర్యటించి యుపన్యాసము లిచ్చియున్నారు. ఇట్టి త్యాగముచేసిన భారతీయుని చరిత్రలోఁ గని వినియుండలేదు. వీరి శిలావిగ్రహమును స్థాపించుట పౌరుల విధియై యున్నది.

ఉడుతకు ఉడుతభక్తిగా నాయీ చిఱుతకృతిని వీరి కంకితమొనర్చితిని; అంతకన్న నేను వారిని గౌరవించుటకు శక్తిగాని, మార్గముగాని లేదు. సర్వేశ్వరుఁడు ఈ 'రక్తదాత'కు వేయేండ్లాయువును, ఆరోగ్యమును బ్రసాదించుఁగావుత!

శ్రీ శంకరాచార్యులు కేరళదేశమునఁ గాలటి యను పల్లెయందు జన్మించెను. తన తల్లికి నుత్తరక్రియలఁ గావించి కౌగణాంతరమునచే నింటి దాపుననే శంకరుఁ డామె మృతకళేబరమును దహనముగావించెను. కేరళీయు లా స్థలము నిప్పటికినిఁ జూపించెదరు. హిమాచలమందలి బదరికారణ్యమున నారాయణుని పేర శంకరుఁడొక్క దేవాలయమును బ్రతిష్ఠించెను. అందుఁ బూజారు లనాదినుండి మళయాళదేశమునకుఁ జెందిన నంబూద్రి తెగ బ్రాహ్మణులుగ నున్నారు శంకరుఁ డీ తెగకుఁజేరిన బ్రాహ్మణుఁడు. కాలటి యొక అగ్రహారము. దీనికి సమీపమునఁ గేరళదేశములోని పూర్ణానదియు వృషాచలమును గలవు. కేరళదేశమును రాజశేఖరుఁడను రాజు పరిపాలించిన కాలములో నాతనికి శివుఁడు సాక్షాత్కరించి, తాను జ్యోతిర్లింగాకారముతో వృషాచలమునొద్ద పుట్టినట్లు తెలుపుకొనెను. అంత నా ప్రభువు లింగమున్నచోట నొక దేవాలయముగట్టి యొక్క అగ్రహారమును బ్రతిష్ఠించెను. ఇదియే 'కాలటి' యను నగ్రహారము. ఈ యగ్రహారములో 'విద్యాధిరాజ' బిరుదాంకితుఁడగు నొక్క బ్రాహ్మణోత్తమునకు 'శివగురుఁ'డను పుత్త్రుఁ డుద్భవించెను. శివగురుని భార్యయగు 'నార్యాదేవి' గర్భమున శివుఁడు స్వీయతేజస్సును బ్రసరింపఁజేసి శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులను లోకమునకుఁ బ్రసాదించెను.

శంకరుఁడు రేవానదీతీరమందుఁగల మాహిష్మతీపురమున కేఁగి జైమినీ మతావలంబి యగు మండనమిశ్రునింజూడఁ బోయెను. అప్పుడు మండనమిశ్రుని పితృకార్యమగుటచేఁ దలుపు మూయఁబడియుండెను. శంకరుఁడు తన యోగబలముచేత నింటిలోనికిఁ బ్రవేశించెను. సన్యాసులు వేదబాహ్యులని మండనమిశ్రుని యాశయము, అందుచే నాతఁడు శంకరునిఁ బరుషోక్తు లాడెను. అంతటఁ బూర్వ మచ్చటకు వచ్చిన బ్రాహ్మణులు జైమినివ్యాసులు సమాధానపఱిచిన పిమ్మట మండనుఁడు శంకరుని భిక్షకు నిలువుఁడని వేఁడెను. అందుపై శంకరుఁడు వాదభిక్షనుగోరి ""నే నోడి

పోయిన నీవు శిష్యుఁడవై గృహస్థాశ్రమమును స్వీకరించెదను; నీ వోడిన నాకు శిష్యుఁడవై సన్యాసము గ్రహింపవలె" నని వేఁడెను. మండనుని భార్య మధ్యస్థగా వాదప్రతివాదము లాఱుదినములు జరిగెను. భారతీదేవి యుభయుల కంఠంబులందు వేసిన పూలమాలికలలో మండనునిమాలిక క్రమముగా జీర్ణించిపోయెను. అంత భారతీదేవి శంకరు నుద్దేశించి "నే నర్ధాంగిని; నన్ను జయించినఁగాని నీ విజయము పూర్తిగా నేరదు; నీవు నాతో వాదింపవలయును" అని శంకరునిఁ గోర నతఁ డామెతోఁ బదియేడు దినములు వాదించెను. శంకరుని సర్వజ్ఞత నానాఁటికి దృఢపడెను. పరాజయము నిశ్చయము కాఁగా భారతి శంకరుని మోసగింపనెంచి రతిరహస్యముల నెఱుంగఁడని భావించి కామశాస్త్రమునందు అతనిఁ బ్రశ్నింపసాగెను. శంకరుఁడు మాసముమాత్రము వ్యవధానము తీసికొని యాకాశమున కుద్గమించి, యొకానొక పట్టణమునకుఁ బోయెను. అచ్చట నమరకుఁడను ప్రభువు వేఁటయందు పడఁగొట్టి మరణించి యుండెను. విలాసవతులగు నాతని సతీమణులు సన్నిహితమునఁ బతినిఁ గూర్చి విలపించుచుండిరి. అప్పుడు శంకరుఁడు పద్మపాదు నుద్దేశించి "పరకాయ ప్రవేశవిద్యచేత నీ ప్రభువు దేహమునందుఁ జొచ్చి, రతి రహస్యములు నేర్చి భారతీదేవి నోడించెదను; అందాఁక నా శరీరమును సంరక్షింపుము; నేను మాసములో మగిడి వచ్చెదను" అని చెప్పి ప్రాణములఁ దన మేనినుండి యుత్క్రమింపఁజేసి యమరుకుని మేనఁ బ్రవేశించెను. అమరుకుఁడు పునరుజ్జీవితుఁడు కాఁగానే పౌరులు అంతఃపురకాంతలు ఆమందానందము నొందిరి. నర్మదానదీతీర మందలి యరణ్యములోఁ బద్మపాదుఁడు శంకరుని శరీరము నొక తరుకోటర మున దాఁచి కాపాడుచుండెను.

శంకరుఁడు విషయసుఖలాలసుఁడై స్వస్వరూపము మఱచి శృంగారవార్ధి నోలలాడుచుండెను. రాజు ప్రవర్తనయందలి భేదమును గుర్తెఱిఁగి ఏదో కారణమున జేసి మేనియం దొక మహాపురుషుఁడు ప్రవేశించి స్వశరీరము నెందో దాఁచియుండెనని యమాత్యుఁ లూహించి, అద్రిగుహారణ్యాదుల నెందైన నెవ్వరిచేనైన గుప్తము గావింపఁబడిన దేహములను దహించునట్లు చండశాసనము గావించిరి. ముప్పది దినములు గడచిపోయెను. శంకరుఁడు స్వశరీరమునకు సన్నద్ధుఁడు కాలేదు. ఇంతలో గుప్తశరీరములను భటులు

కొల్చుచున్నారనువార్త పద్మపాదుఁ డెఱింగి హుటాహుటి నడల నమరకుని రాజ్యము మారువేషమునఁజొచ్చి రాజు నుద్దేశించి యన్యాపదేశముగా శంకరుని పూర్వవృత్తాంత మాతనికి నివేదించెను. శంకరునకు స్మృతిగలిగి వెంటనే యమరుకుని శరీరమువీడి స్వశరీరమును బ్రవేశించెను. అప్పటికే చారులు శంకరుని గుప్తశరీరమునకు నిప్పంటించి యుండిరి. శంకరుఁడు నారసింహునిఁ బ్రార్థించి తన శరీరమును దొల్లింటివలెఁ గావించుకొనెను. ఈ ధ్యాన శ్లోకములు "లక్ష్మీనృసింహ మమదేహికరావలంబం" అను మకుటముగలిగి వ్యాప్తిలోనున్నవి. అనంతరము శంకరుఁడు మండనమిశ్రునింటికిఁబోయి కళాశాస్త్రమునందు స్వీయవ్రతభంగము గాకుండ భారతీదేవి నోడించెను. మండనమిశ్రుఁడు శంకరునకు శిష్యుఁడయ్యెను. శంకరుఁడు నిర్మించిన ఋశ్యశృంగాది పీఠములలో నామె యధివసించుట కంగీకరించెను.

శంకరుఁడు చని ఇప్పటికి వేయిసంవత్సరములైనను అతఁడుబోధించిన యద్వైతసిద్ధాంతము సుస్థిరమై దివ్యజ్ఞాన సమాజమువారి ప్రచారమువలనను, శ్రీ వివేకానందుని ప్రభావాతిరేకమువలనను పాశ్చాత్యదేశములందు సైతము వ్యాపించి యచ్చట విద్వాంసులకుఁ దత్త్వజ్ఞులకు నద్భుతను గావించుచున్నది.

"శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్,"

నెల్లూరు,
2–12–1959.

విద్వద్విధేయుఁడు,
కొలకుల నారాయణరావు.

శ్రీ రామాయ నమః

# శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రము

~~~/o/~~~

శ్లో. శ్రీమత్పయోనిధినికేతన! చక్రపాణే!
భోగీన్ద్రభోగమణిరాజితపుణ్యమూర్తే!
యోగీశ! శాశ్వత! శరణ్య! భవాబ్ధిపోత!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 1

శ్రీమత్పయోధివాసీ! చక్రపాణీ!
యోగీశ! శాశ్వత! భోగీంద్రభోగ
శృంగారరత్నరాజితపుణ్యమూర్తి!
భవవారినిధిపోత! భక్తశరణ్య!
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీమత్ = శోభాయమానమైన, పయోధి = పాలసముద్రము నందు, వాసీ! = నివసించు స్వామీ! చక్రపాణి = చేతియందుఁ జక్రాయుధము కల దేవా! యోగీశ! = యమనియమాద్యష్టాంగసిద్ధులైన యోగులకుఁ బ్రభువైన మూర్తీ, శాశ్వత! = నాశరహితుఁడా, భోగీంద్ర = ఆదిశేషుని యొక్క, భోగ = పడగలయందలి, శృంగార = మనోహరములైన, రత్న = రత్నములచేత, రాజిత = ప్రకాశించుచున్న, పుణ్యమూర్తి! = పవిత్ర స్వరూపా, భవవారినిధిపోత! = సంసారసముద్రమును దాఁటుటకు తెప్ప వంటి తండ్రీ, భక్తశరణ్య! = భక్తుల కాశ్రయమైనంగు దేవా, శ్రీనృసింహా! = లక్ష్మీదేవితోఁ గూడిన నరసింహస్వామీ, నాకుఁ + చేయూఁతన్ + ఇమ్ము = నన్నుద్ధరింపుము.
~~~

తా. పాలవెల్లిలో శేషతల్పముపై శయనించి, చక్రాయుధము హస్తమునందుఁ దాల్చి, యోగులకు ప్రభుఁడవై, కాలాతీతమూర్తివై, ఆదిశేషుని పడగలలోని మేల్మిరతనాల కాంతిప్రసారమున వెలుఁగొందు పవిత్ర స్వరూపా! సంసారసాగరమును దాఁటింపఁగల స్వామీ! భక్తులకాశ్రయుఁడవై, సంపత్కరయగు లక్ష్మీదేవితో వెలుఁగొందు నరసింహమూర్తీ! నన్నుద్ధరింపుము.

దేహి వైష్ణవమాయచే జననమరణబాధా ప్రవాహమున మునిఁగి తాపత్రయములఁ గొట్టుకొనుటఁ జూచి జ్ఞానియగు శ్రీ శంకరాచార్యులు తన యిష్టదైవమగు శ్రీ నరసింహమూర్తి స్తోత్రమును సంసారతారకముగా రచించెను. మంగళాచరణముగా తన దేవుని నిర్దేశించుచున్నాఁడు.

శాశ్వత!– ఆదిశంకరులకు తోఁచిన ఈ పదమే మూకమహాకవి తన కామాక్షీపంచశతిలో

శ్వేతా మందరహసితే
శాతామధ్యేహి వాఙ్మనోతీతా
శీతాలోచన పాతేస్ఫీతా
కుచ సీమ్ని శాశ్వతీమాతా. (ఆర్యా–20)

ముదిగొండ వీరభద్రమూర్తిగారి తెనుఁగు పద్యము—

చిన్ని నగవున శ్వేతయుఁ, నెన్నడుమున
శాతయుఁ, గటాక్షపాతాన శీతయు నగు
మాతను, బయోధరద్వయీస్ఫీత- నభిను
తింతు శాశ్వత వాఙ్మనోతీత నెపుడు.

అదే మూకమహాకవి మఱియొకచోట—

అభిదాకృతిర్భిదాకృతి రభి
దాకృతి రపి చిదాకృతిర్మాతః
అవహం తాత్వ మహంతా
భ్రమయసి కామాక్షి శాశ్వతి విశ్వమ్. (ఆర్యా-47)

దానికి ఆంధ్రీకరణ

అమ్మ కామాక్షి! నీ వఖిలాకృతివి; ఖి
దాకృతివి, ననహంత వహంతవు, నచి
దా కృతివియుఁజిదాకృతి వగుచు నిట్లు
శాశ్వతీ! భ్రమపఱతె విశ్వమ్ము నెల్ల —

ఈ శ్లోకమున 2-వ గీతయే, సాహిత్యసంగీతజ్యోతిష వేదాంత భావములఁ జూపుచున్నది. శ్రీ మహావిష్ణువు నీలమేఘచ్ఛాయ, లక్ష్మి విద్యుల్లత తెలుపు, ఆదిశేషునిపడగలలోని మణులకాంతి యెఱుపుడాలు, సంజవేళల మింటిసొగను దీపించుచున్నది. వీరి ముగ్గురతో శ్రీకృష్ణదేవ రాయల పద్యముఁ జూడుఁడు.

సిరి నొక్కప్పుడు కన్నుఁగొంగి హరి దక్షేరం బ్రహర్షించు ను
ర్వరకున్ వంచనగూడఁగా గలఁగు భాస్వచ్చంద్రశాలా పరం
పరలయ్యెన్ బఱపైన యెవ్వనిఫణాపంక్తుల్ ...
భూభారమున శ్రమపడు ఆదిశేషుని పడగలకింతటి వర్ణన!

సంగీతరీత్యా చూతము - 16వ 17వ శ్లోకములలో కొన్ని సంబోధన లున్నను, నోరార పిలిచిన సంబోధన మిదియే. ఈ గీతగమకమే సంగీతమును బుట్టించుచున్నది. కల్యాణిరాగమున మధ్యమషడ్జమస్థాయిల మార్చుకొనుచు పాడిననే దీని రసము గ్రోలఁగలము. జ్యోతిషమురీత్యా పంచపదములతో సంబోధించెను గాన పంచాననయోగము స్ఫురించుచున్నది.

వేదాంతభావము— ఆదిశేషుఁడే కుండలి. బట్టుమూర్తి పద్యము—

మహీ మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ ...

అట్టి కుండలికి పట్టగు నడిబొడ్డులోనే శ్రీ మహావిష్ణువు వసియించు మణి పూరకచక్ర మున్నది. "మణిరాజిత" అని చదువుచవుడు జ్ఞానికి మణి పూరక పుణ్యమూర్తే అని ధ్వనించుచుండును.

"పయోధివాసి, చక్రపాణి" పదములు ఆధ్యాత్మికపరమైన మూల పదములని తోఁచుచున్నవి. అంతేగాక వేదాంతార్థమును, పరిపూర్ణా నందుఁడు చక్కఁగా వివరించెను. గనుక అభినవతిక్కనగారి తెనుఁగు పద్యము—

ఉ॥ గండపుఁజెట్టు పట్టుకొని గాఢవియోగశిఖిప్రసక్తినాన్
సాంద్రత నార్పుచుఁ గమఠపట్కపరిస్ఫుట దంతరథ్యముఁ
మందగతిన్ గ్రమించి మదవార సుధాబ్ధి సకాంత్రయై సుకాం
తిం దులకించు చక్రితవనీమణిచేఁ గరముల్ మొగిడ్చెదన్.

ఇన్ని భావము లొకగీతిలోనే ఆదిశంకరులు చూపినాఁడు.

శ్లో. బ్రహ్మేన్ద్ర రుద్ర మరుదర్క కిరీటకోటి
సంఘట్టితాఙ్ఘ్రికమలామలకాన్తికాన్త!
లక్ష్మీలసత్కుచసరోరుహరాజహంస
లక్ష్మీనృసింహా! మమ దేహి కరావలమ్బమ్. 2

బ్రహ్మేంద్రశివమరుద్భాను కిరీట
కోటిసంఘట్టితకోమలచరణ
మహనీయమానితామలకాంతికాంత!
శ్రీ కుచాంభోరుహ శ్రితరాజహంస!
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్మా.

టీ. బ్రహ్మ = బ్రహ్మయొక్క, ఇంద్ర = దేవేంద్రునియొక్క, శివ = శివునియొక్క, మరుత్ = వాయుదేవునియొక్క, భాను = సూర్యుని యొక్క, కిరీట = కిరీటముల, కోటి = అంచులచే, సంఘట్టిత = ఒరసికొనఁ బడిన, కోమల = సున్నితమైన, చరణ = పాదములయొక్క, మహనీయ = మహిమగలిగిన, మానిత + అమల = పొగడఁదగిన నిర్మలమైన, కాంతి

= ప్రకాశముచేత, కాంత = మనోహరమైనవాఁడా! శ్రీ = లక్ష్మీదేవి యొక్క, కుచాంభోరుహ = పాలిండ్లనెడి తామరమొగ్గలను, శ్రిత = ఆశ్రయించిన, రాజహంస = రాజహంసమువంటి స్వామీ!

తా. స్వామీ! బ్రహ్మ, ఇంద్రుఁడు, శివుఁడు, వాయువు, సూర్యుఁడు నీ మ్రోల నిల్చి, నీ పాదములనంటి మ్రొక్కుదురు. వారి కిరీటములలోఁ బొదివిన మణుల జిగిమెఱుఁగులచే నీ పాదములు విలసిల్లుచుండును గదా! తమ్మిమొగ్గలవంటి విహరించు రాయంచవలె లక్ష్మీదేవి యొక్క స్తనములను నీవు విహరించుచుందువుగదా! ఓ నరసింహమూర్తీ! సంసారజలధిలోఁ మునిఁగిపోవు నాకు చేయూఁత నొసఁగి సముద్ధరింపుమయ్యా!

తాను సేవించిన దేవుని యున్నతిని చెప్పినాఁడు. కిరీటముల మణులకాంతులతోడనే క్రొత్తయెఱుపుఁదనము పొందిన పాదములు కలవాఁడని ఉత్ప్రేక్షింతురు. శ్రీ శంకరాచార్యులు శివానందలహరిలో నీ విధముగా చమత్కరించినారు.

కథం కర్తవ్యం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణిర్నిజకనకమాణిక్యమకుటైః.

(నమస్కారము చేయుటకు తొందరపడుచున్న దేవతలగుంపుయొక్క రత్నాల బంగారు కిరీటములు నేను మిమ్ముల నమస్కరించుట కడ్డమగుచున్నవి.)

శ్లో. సంసారసాగరవిశాలకరాళకాల
నక్రగ్రహగ్రసననిగ్రహవిగ్రహస్య,
మగ్నస్య రాగలసదూర్మినిపీడితస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 3

సంసారవార్ధి విశాలకరాళ
కాలనక్రగ్రహగ్రసితవిగ్రహుండ,
రాగలసద్భంగరాశిపీడితుండ,
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. సంసార = ఆలుబిడ్డల తగులాటముగల సంసారమనెడి, వార్ధి = సముద్రమునందు (సంచరించు), విశాల = గొప్ప ఆకారము గలిగి, కరాళ = భయంకరమైన, కామ = మోహమనెడి, నక్రగ్రహ = మొసలి చేత, గ్రసిత = మ్రింగఁబడిన, విగ్రహుఁడ = రూపముగలవాఁడనై, రాగ = అభిలాషలనెడి, ఉసత్ = మెఱయుచున్న, భంగరాశి = అలల సమూహముచేత, పీడితుఁడన్ = కష్టపెట్టఁబడుచున్నవాఁడను, సంపదలొసంగు లక్ష్మీదేవితో వెలుఁగొందు నరసింహస్వామీ! నన్నుద్ధరింపుము.

తా. లక్ష్మీనరసింహదేవా! సంసారసముద్రమున భయంకరమైన మోహమనెడి పెద్దమొసలిచేత మ్రింగఁబడుచు, అభిలాషలనెడి యలలలోఁ జిక్కి గ్రుక్కుచున్న నన్నుద్ధరింపుము.

తన స్తోత్రమును ముఖ్యముగా సంసారమున మునిఁగిన వారికే తారకము కావలయునను తలంపుతో సంసారబాధల నొకటొక్కటిగ వర్ణించుచున్నాఁడు.

సంసారమును సముద్రమని, భార్యాపుత్రులు మొసళులని కులశేఖరాళ్వారులు గూడ వర్ణించినారు.

తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయ సహజగ్రాహ సంఘాకులేచ
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తి నావం ప్రయచ్ఛ.

—ముకుందమాల.

శ్లో. సంసారఘోరగహనే చరతో మురారే!
మారోగ్రభీకరమృగప్రవరార్దితస్య,
ఆర్తస్య మత్సరనిదాఘనిపీడితస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 4

భవఘోరకాననభ్రమణుండ, మార
భయదోగ్రఘనమృగప్రవరార్దితుండ,
మత్సరగ్రీష్మసంపరిపీడితుండ,
ఆర్తుండ నేను మురారి! గోవింద!
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. మురారి = మురుఁడను రాక్షసునిఁ జంపినవాఁడా! గోవింద = భూమి కధిపతీ!, శ్రీనృసింహా = లక్ష్మీదేవితోఁగూడిన నరసింహస్వామీ! నేను, భవ = సంసారమనెడి, ఘోర కానన = భయంకరమైన అడవిలో, భ్రమణుఁడన్ = తిరుగులాడుచున్నవాఁడను, మార = మన్మథుఁడనెడి, భయద + ఉగ్ర = కొట్టవచ్చినంతటి భయంకరమైన, ఘనమృగప్రవర = గొప్ప అడవిమృగములలో ముఖ్యమైనదానిచే, అర్దితుండన్ = కష్టపెట్టఁబడినవాఁడను, మత్సరగ్రీష్మ = ఓర్వలేనితనమను వేసవిచేత, సంపరి = మిక్కిలిగా, పీడితుఁడన్ = పీడింపఁబడువాఁడను, ఆర్తుండన్ = బాధపడువాఁడను, నాకున్ + చేయూఁతన్ + ఇమ్ము = నన్నుద్ధరింపుము.

తా. మురారీ! గోవిందా! శ్రీ లక్ష్మీనృసింహా! నేను భయంకరమగు సంసారకాననములో తెన్నుగానక తిరుగులాడుచున్నవాఁడను; భయంకరమై కొట్టవచ్చెడి మన్మథుఁడనెడి మృగముచేత బాధింపఁబడుచున్నాఁడను. ఓర్వలేనితనమను ఎండకాలముచేత అలఁతపొందువాఁడను; పరిపరి విధముల బాధపడువాఁడను, ఓ లక్ష్మీనృసింహస్వామీ! నీ దయారసము నాపైఁ బఱపుము.

సంసారశ్రమలను మఱొకవిధముగా ఆదిశంకరులు వర్ణించుచున్నారు.

అంతుంబొంతునులేని కాపురమును కవులు సముద్రముగా అడవిగా వర్ణింతురు. ఆదిశంకరులు శివానందలహరిలో మోహమే అడవియని వర్ణించినారు—

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ.

మాత్సర్యము వేసవికాలమని శంకరులు వర్ణించినారు, కాని మూకమహాకవి సంసారమే ఎండకాలముగ వర్ణించినారు.

> జనోఽయం సంతప్తో జనని భవ చండాంశుకిరణై
> రలబ్ధ్వా కించైకం కణమపి పరజ్ఞానపయసః
> తమోమార్గే పాంథస్తవ ఝటితి కామాక్షి శిశిరాం
> పదాంభోజచ్ఛాయాం పరమశివజాయే మృగయతే.

వీరభద్రమూర్తిగారి ఆంధ్రీకరణ—

> ఈ సంసారపు టెండ కొంచె యిప్పుడే యింతయ్యెనే తాళలే
> నే! సుంతైన లభింపదే? యొకింత నీ కెంపున్ దమం బెక్కి క
> న్నోకన్ పైరలు క్రమ్మ నే జనని చిన్మాత్రా వినిం బ్రార్థించుకో
> వే! సర్వేశ్వరపత్ని! నీ అనుగ్రహదర్శనంబు పెన్నిధికన్.

సంసారము, దారిద్ర్యము, మృత్యువు మనుజుని కలవరపెట్టునని ముముక్షువులు. ఆధ్యాత్మికబలము చేకూర్చుటకై స్తోత్రములలో తన్నాశనార్థము దేవులను ప్రార్థించుట సంప్రదాయము, జ్ఞానబుద్ధిచే కాకపోయినను, మనుజుఁడు ఆర్తుఁడై దేవుని భజించి క్రమేణ జిజ్ఞాసువు అర్థకామి, జ్ఞాని యగునని వ్రాసిన స్తోత్రములే యివి.

సంసారము కాననమని, దానినుండి రక్షింపుమని యొక్కభక్తుఁడు శివుని ధ్యానించినాఁడు.

"సంసారదుఃఖగహనాత్ జగదీశ రక్ష" అను మకుటముగల శ్లోకములు ఇట్టివే.

"దారిద్ర్యదుఃఖదహనాయ నమశ్శివాయ" అను మకుటముగల శ్లోకములు.

"చంద్రశేఖరమాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః" అన్న మకుటము గల శ్లోకములు.

శ్లో. సంసారభీకరకరీన్ద్రకరాభిఘాత
నిష్పీడ్యమానవపుషస్సకలార్తితస్య,
ప్రాణప్రయాణభవభీతిసమాకులస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 6

భవభయంకరమదేభకరప్రహార
నిష్పీడ్య గాత్రుండ, నిఖిలార్తితుండఁ,
ప్రాణప్రయాణసంభవభయాకులుఁడ,
శ్రీ నృసింహ! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా!=ఓ లక్ష్మీనరసింహమూర్తీ!, నేను, భవ=సంసారమను, భయంకర=భయముపుట్టించు, మద+ఇభకర=మదించిన ఏనుఁగు తొండముయొక్క, ప్రహార=దెబ్బలకు, నిష్పీడ్య=ఎక్కువగా కష్టపెట్టఁబడిన, గాత్రుండఁ=దేహముగలవాఁడను, నిఖిలార్తితుఁడఁ=అన్నివిధములఁ గాసిపెట్టఁబడుచున్నవాఁడను, ప్రాణప్రయాణసంభవ=చావు తటస్థించుననను, భయాకులుఁడఁ=భయముచేఁ గలఁతపెట్టఁబడినవాఁడనగు, నాకుఁ=నాకు, చేయూఁతఁ+ఇమ్ము=ఆధారమవగుము.

తా. ఓ లక్ష్మీనృసింహమూర్తీ! సంసారమను భయంకరమైన మదపుటేనుఁగు తొండపుదెబ్బలకు పీడనొందుచు, పరిపరివిధములుగా కష్టపెట్టఁబడుచు, ప్రాణము పోవునన్న భయముచేఁ గలఁతపడు నాకాధారము చూపింపుము.

శంకరాచార్యులవర్ణన యిది నూతనముగా నున్నది. శ్రీశంకరాచార్యులు, రాజులు విధించు శిక్షలలోనిదగు నేనుఁగుచేఁ ద్రొక్కించుట చూచి యీ వర్ణన వ్రాసినారాయని యూహింపఁదగియున్నది. ప్రాణము పోవునన్న ప్రతిమానవునకు భయమేకదా!

శ్లో॥ సంసారసర్పవిషదుష్టభయోగ్రతీవ్ర
దంష్ట్రాకరాళవిషదగ్ధవినష్టమూర్తేః,
నాగారివాహన! సుధాబ్ధినివాస! శౌరే!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్॥ 7

భవసర్పవిషదుష్టభయసముదగ్ర
తీవ్రదంష్ట్రాతివిషవ్రాతదగ్ధ
నష్టమూర్తిని — సుధార్ణవవాస! శౌరి!
నాగారివాహనా! నారాయణుండ!
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. సుధార్ణవవాస = పాలసముద్రమున నివసించుస్వామీ! శౌరి= శౌర్యముగలవాఁడా, నాగారివాహనా = సర్పముల విరోధియైన గరుత్మంతుని వాహనముగాఁగల దేవా, నారాయణుండ = శ్రీమహావిష్ణుమూర్తీ, శ్రీనృసింహా = చిత్కళాలక్ష్మిచే వెలుఁగు ఓ నరసింహస్వామీ! భవసర్ప= సంసారమను పాముయొక్క, విష = విషము గ్రక్కుటచే, దుష్ట=చెడ్డదై, భయ = భయముగొలుపు, సముదగ్ర = నిండుగా క్రూరమగుచు, తీవ్ర = కఠినమైన, దంష్ట్ర = కోరలయొక్క, అతివిషవ్రాత=ఎక్కువయైన విషపుముద్దచే, దగ్ధ = కాల్పఁబడిన, నష్టమూర్తిని = పోఁగొట్టుకొన్న దేహము గలవాఁడను, నాకుఁ = నాకు, చేయూఁతఁ + ఇమ్ము = నన్నుద్ధరింపుము.

తా॥ పాలసముద్రమున కాపురముండు స్వామీ! శౌర్యమూర్తీ! గరుడవాహనా! నారాయణమూర్తీ! ఓ లక్ష్మీనృసింహదేవా! నేను సంసారమను పాముయొక్క విషము గ్రక్కుచు చెడ్డదై భయము గొలుపుచు కఠోరమును క్రూరమైన కోరలనుండివచ్చు విషపుముద్దల కాల్పులచే నష్టమైన శరీరముగలవాఁడను స్వామీ! నాకు దిక్కు చూపింపుము.

ఈ పాలసముద్రము విష్ణువు సొంతసొమ్ము కాదు. మామగారిల్లు కాదు. ఇది అధ్యాత్మికపు పాలసముద్రము. పాలసముద్రమే సహస్రారము. దేవి నివాసముకూడ అదియే.

అమృతపయోధి, కల్పకవనావృతమౌ మణిదీవి నీపపుం
బ్రమదవనమ్ము సాల్చి సురవల్లి ప్రకోటం, శివస్వరూపమం
చమున సదాశివాంకమున జాయను నీ సుఖచిత్స్వరూపముగా
సమతవిహారులైన యొకకొందఱు ధన్యులు గొల్తు రీశ్వరీ!

మహాశివభక్తులగు మార్కండేయులుకూడ సంసారము పామను అభిప్రాయము సూచించిరి.

సంసారసర్పదష్టానాం, జంతూనామవివేకినాం
చంద్రశేఖరపాదాబ్జ, స్మరణం పరమౌషధమ్.

శ్లో. సంసారజాలపతితస్య జగన్నివాస!
సర్వేంద్రియార్థబడిశస్థఝషాత్మనశ్చ,
ప్రోత్తమ్భితప్రచురతాలుకమస్తకస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 8

భవజాల పతితుండఁ, బ్రభు! లోకవాస!
సర్వేంద్రియార్థ మత్స్యాళిబంధనస్థ
మీనాత్మయుండనై మిడుకు చున్నాఁడఁ,
బ్రోత్తంభిత ప్రచు రాత్త తాలూత్త
మాంగంబు నొందిన యధమాధముఁడను,
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా, ఓ లక్ష్మీనరసింహదేవా, భవజాల=సంసారమనెడు వలలో, పతితుఁడఁగా=పడినవాఁడనైతిని, ప్రభు=దేవా, సర్వేంద్రి

యార్థ = సకలవిషయవాంఛ లనెడి, మత్స్యనిబంధనస్థ = గాలములలోఁ జిక్కుకొనిన, మీనాత్మయుక్త = ఒక చేపవలె, మిడుకుచున్నాఁడన్ = చేతులు పిసికికొనుచున్నాఁడను, శోకనాశ = సర్వాంతర్యామివగు స్వామీ, ప్రోత్తంభిత = పైకెత్తఁబడిన, ప్రచుర = తెలుపఁబడిన, ఆర్త = వెడల్పయిన, తాలు = దవడలును, ఉత్తమాంగంబు = శిరస్సును, ఒందిన = పొందిన, అధమాధముఁడను = అంబటికంటె తక్కువవాఁడను

తా. స్వామీ! ఈ సంసార మనునది యొక వల వంటిది. చేప వలె నేను దానిలోఁ జిక్కితిని. గాలములవంటి విషయవాంఛలు నన్ను నొక్కిపట్టి సంసారజాలమునుండి వెలువడనీయకున్నవి. చేయునదిలేక, నేను మొరపెట్టి రోఁజుచున్నాను. దయయుంచి నన్ను కాపాడుము.

శ్లో. సంసారవృక్ష మఘబీజ మనన్తకర్మ
శాఖాయుతం కరణపత్ర మనఙ్గపుష్పమ్,
ఆరుహ్య దుఃఖజలధౌ పతతో దయాళో!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 9

అఘబీజము, ననంత మగు కర్మలతలు
కరణపర్ణమ్ములు, కామపుష్పంబు
గల్గు సంసారవృక్షమ్ము పై కెక్కి
వ్యసనవారాశిలోఁ బడితి; దయాళు!
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా = లక్ష్మీనృసింహస్వామి, అఘబీజము = పాపమను విత్తనము, అనంతమగు = తెంపులేని, కర్మలతలు = చేయవలసిన పను లను తీఁగెలు, కరణపర్ణమ్ములు = అవయవము లను ఆకులు, కామపుష్పంబు = కోర్కె లను పూలు, కల్గు = కలిగిన, సంసారవృక్షమ్ము = సంసార మను చెట్టు, పైకెక్కి = మీఁద కెక్కి, వ్యసనవారాశిన్ = దుఃఖసముద్రములో,

పడితిని = పడితిని, దయాళు = దయగలిగిన స్వామీ, చేయూఁత నిమ్ము = నాకు నాధారమ వగుము.

తా. స్వామీ! సంసారము వృక్షము వంటిది. పాపమే దీని యుత్పత్తికి హేతువైన బీజము. పురాకృతదుష్కృతములే దీని కొమ్మలు. ఇంద్రియవ్యాపారములే యీవృక్షము నావరించియుండు ఆకులు. కామాసక్తియే యిది పూచెడు పువ్వు. ఇట్టి వృక్షము నెక్కి, కడకు దుఃఖసముద్రములోఁ గూలితిని. దయాకరా! చేయూఁత నొసంగి నన్ను రక్షింపుము.

శ్లో. సంసారదావదహనాకులభీకరోగ్ర
జ్వాలావళీభిరభిదగ్ధతనూరుహస్య,
త్వత్పాదయుగ్మసరసీరుహమస్తకస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 10

భవదావదహనాకులవిభీకరోగ్ర
హేత్యావళీదగ్ధహేయరోముఁడను,
ద్వత్పాదయుగమహోత్పలమస్తకుఁడను,
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా = ఓ లక్ష్మీనరసింహస్వామీ, భవ = సంసారమను, దావదహన = కొలుచిచ్చుమంటలచే, ఆకుల = కలఁతపెట్టుచు, భీకర = భయముగొల్పుచు, ఉగ్ర = కొట్టవచ్చినట్లున్న, హేత్యావళీ = నాలుకలు చాఁచిన మంటలచే, దగ్ధ = కొల్పఁబడిన, హేయరోముఁడను = అసహ్యించుకొనఁదగిన వెంట్రుకలు కలవాఁడను, త్వత్ = తమ, పాదయుగ = పాదములను, మహోత్పల = పద్మములను ఆశ్రయించిన, మస్తకుఁడను = శిరస్సు గలవాఁడను, నాకు, చేయూఁతన్ ఇమ్ము = ఆధారముఁ జూపింపుము.

తా. ఓ నరసింహస్వామీ! కలవరపెట్టుచు, భయము గొల్పుచు, కొట్టవచ్చినట్లున్న సంసారమను కొఱివిచ్చుమంటలచే వెంట్రుకలు కమిలినవి. నీ చరణారవిందములను దలఁదాల్చుకొనుచున్నాను. నా తాపమును దీర్పుము.

శ్లో. సంసారసాగరనిమజ్జనముహ్యమానం
దీనం విలోకయ విభో! కరుణానిధే! మామ్,
ప్రహ్లాదఖేదపరిహార! పరావతార!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 11

ప్రహ్లాదదుర్వ్యథాపరిహారి వీవు,
అరయ — విభుఁడవు, పరావతారుఁడవు,
కరుణానిధివి, భవాగాధసముద్ర
మగ్నుంగుఁడను — దిక్కుమాలినవాఁడ
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్మ.

టీ. శ్రీనృసింహా! ఓ లక్ష్మీనరసింహస్వామీ! నీవు, ప్రహ్లాద=ప్రహ్లాదుని, దుర్వ్యథా = చెడ్డబాధలను, పరహారివి = పోఁగొట్టినవాఁడవు, విభుఁడవు = అందఱకు ప్రభుఁడవు, పరావతారుఁడవు = శ్రేష్ఠములైన మత్స్యకూర్మాది దశావతారములఁ దాల్చినవాఁడవు, కరుణానిధివి = కరుణకు తావైనవాఁడవు, ఇఁక నేను, భవ = సంసారమను, అగాధసముద్ర = అంతులేని లోఁతుగల సముద్రమందు, మగ్నుంగుఁడను=మునిఁగినవాఁడను, దిక్కుమాలినవాఁడను = ఏ దిక్కు లేక బాధపడువాఁడను, నాకు = నాకు, చేయూఁతగా ఇమ్మ = నాకు దిక్కు కల్పింపుము

తా. ఓ లక్ష్మీనృసింహా! నీవు పాలించువాఁడవు, పరతత్త్వముయొక్క శ్రొత్రరూపమవు, కరుణారూపుఁడవు, ప్రహ్లాదుని కష్టముల పోఁగొట్టినవాఁడవు, నేను అంతులేని సంసారసముద్రమున మునిఁగి యే దిక్కు లేనివాఁడను, తండ్రీ! నన్నుద్ధరింపుము.

సంసారదుష్టకుంజరకర్కశోగ్ర
దంష్ట్రాభిహతుఁడను — దైత్యసంహారి!
ప్రాణప్రయాణసంభవభీతిఁ బాపి
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా! = ఓ సంపత్స్వరూపుఁడవగు నృసింహమూర్తీ!, సంసార = సంసారమను, దుష్టకుంజర = చెడ్డ ఏనుఁగుయొక్క, కర్కశ = కఠినములై, ఉగ్ర = కొట్టవచ్చినట్లున్న, దంష్ట్రా = కోఱలచేత, అభిహతుఁడను = చావుదెబ్బ తిన్నవాఁడను, దైత్యసంహారి = రాక్షసుల సంహరించిన దేవా, ప్రాణప్రయాణసంభవ = ప్రాణము బొందెను వీడిపోవునేమో యన్న, భీతిన్ = భయమును, పాపి = పోఁగొట్టి, నాకున్, చేయూఁత నిమ్ము = చేయి అందిమ్ము.

తా. ఓ నృసింహస్వామీ! అనేకరాక్షసుల వధించిన తండ్రీ! సంసార మను చెడ్డయేనుఁగుయొక్క కఠోరమైన ఉగ్రమైన దంతములచేత దెబ్బతిన్నవాఁడను; ప్రాణముపోవు దినము వచ్చునను భయమును బాపి నన్ను రక్షింపుము.

ప్రాణముపోవునన్న భీతిఁ బాపుమని ఆఱవశ్లోకమున నేకాక మఱల నిచ్చట ప్రస్తావించినారు. ఇదిగాక 14-వ శ్లోకమున మఱల వర్ణించినారు. మూఁడుమార్లు వర్ణించుటచే నీ ఘట్టము ప్రశస్తమైనదని భావింపవలెను. ప్రాణముపోవుట యను ఘట్టము ప్రతిమనుజునకు భగవచ్ఛక్తిని నిరూపించుచున్నది. ఎంతటి ధీరుఁడును శ్మశానవైరాగ్యమును దలఁచి భగవంతుని ప్రశంసింపకపోఁడు. ఈ ఘట్టమునే వివేకానందస్వామి మధురముగా వర్ణించినాఁడు.

"What ever may be the position of philosophy, whatever may be the position of meta-physics, so long as there is such a thing as death in the world, so long as there is such a thing as weakness in the human heart, so long as there is

a cry going out of the heart of man in his every weakness, there shall be a faith in God." (Chicago Address)

కాన జీవి మరణభయముచేతనుగూడ భగవంతుని ధ్యానించును. ఈ మరణభయము ప్రతిమనుజుఁ డెఱుఁగును. కాని, మోహమున మునిఁగి దానిని తలఁపఁడు. దేవుని భజింపఁడు. మనుజుఁడేమిటి? యతులుకూడ తలఁపరని ధూర్జటి యనుచున్నాఁడు.

చావంగాలము చేరువౌ టెఱిఁగియుం జాలింపఁగాలేక త
న్నేవైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో యేమందు రక్షించునో
యే వేల్పుల్ కృపఁజూతురో యనుచు నిన్నింతైనఁ జింతింపఁగా
జీవశ్రాద్ధము చేసికొన్న యతియుకా శ్రీ కాళహస్తీశ్వరా!

అంతేకాదు. ఇంకొక పద్యము—

గడియల్ రెంటికొ? మూఁటికో? గడియకో? కాదేని నేఁడెల్లియో
కడ నేఁడాదికొ? యెన్నఁడో? యెఱుఁగ మీకాయంబు లీభూమిపైఁ
బడఁగానున్నవి ధర్మమార్గమొకటిం బాటింప రీమానవుల్
చెడుగుల్ నీపదభక్తియుం దెలియరో? శ్రీ కాళహస్తీశ్వరా!

కాని, మరణ మెవ్వరిని కలవరపెట్టును? అపరిపూర్ణజ్ఞానిని కలవరపెట్టును. సర్వము శివుఁడని ధ్యానించువారిని కలఁతపెట్టఁజాలదు. ఈ రహస్యమే శ్రీకృష్ణుఁడు అర్జునునకు తెలిపినాఁడు.

జరామరణ మోక్షాయ
మా మాశ్రిత్య యతన్తియే
తే బ్రహ్మ తద్విదుఃకృత్స్న
మధ్యాత్మం కర్మ చాఖిలమ్. (విజ్ఞానయోగము)

కాన జ్ఞానియగువాఁడు మరణమును జూచి చిఱునవ్వు నవ్వును. ఇదే ఘట్టమున ఉమర్ ఖయామ భావమును చూడుఁడు.

మరణభయంబు నాకు నణుమాత్రము లేదు; మదీయజీవసం
భరణభయంబె మిక్కుటము; ప్రాణము దైవమునొద్ద వడ్డి కే
హారమున కప్పుగొంటి, ఋణమంతయు నిమ్మని తల్పు తట్టినక
సరసర పోయి నిక్కముల సంచులు ముందఱ విప్పి పోసెదక.

శ్లో॥ సంసారయోగిసకలేప్సితనిత్యకర్మ
సంప్రాప్యదుఃఖసకలేన్ద్రియమృత్యునాశ,
సఙ్కల్ప! సిన్ధుతనయాకుచకుఙ్కుమాఙ్క!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 13

భవయోగిసకలలిప్సానిత్యకర్మ
సంప్రాప్తదుఃఖ సంచయముల — మఱియు
సకలేంద్రియములఁ, బంచత్వమ్ముఁ ద్రుటిని
సమయింపఁజేయు సత్సంకల్పరూప!
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ॥ శ్రీనృసింహా=ఓ లక్ష్మీనరసింహస్వామీ! భవయోగి=సంసారి, సకల = అన్నివిధములైన, లిప్సా = ఆశలతోఁ జేసిన, నిత్యకర్మ=ప్రతిదిన కార్యములవలన, సంప్రాప్త = పొందిన, దుఃఖసంచయములన్ = అనేక దుఃఖములను, మఱియు = అవిగాక, సకలేంద్రియములన్ = సకల విషయ వాంఛలను, పంచత్వమ్మున్ = మరణమును, త్రుటిని = క్షణకాలములో, సమయింపఁజేయు=నశింపఁజేయు, సత్సంకల్పరూప=సంకల్పముగలదేవా, నాకు, చేయూఁతనిమ్ము = ఆధారము కల్పింపుము.

తా॥ దేవా! సంసారమునఁ దగుల్కొనినవాఁడు, ఇంద్రియవ్యాపారములచేఁ బీడింపఁబడి నిత్యకర్మములమూలమున దుఃఖములపాలగుచున్నాఁడు. ఏనాఁడు మరణింతునో యని యీనాఁడే భయముతోఁ గ్రుంగి కృశించుచున్నాఁడు. జరామరణభయనాశకుఁడవైన నీవే యిట్టివారికి దిక్కు.

సంసారమును చీదరించుకొను ధూర్జటి పలుకులు వినుఁడు.

కాసంతైన సుఖంబొనర్చునో? మనఃకామంబు లీడేర్చునో
వీసంబైనను వెంటవచ్చునో? జగద్విఖ్యాతి గావించునో
దోసంబుల్ పెడఁబాపునో? తలఁచినం దోడ్తో మిముం జూపునో
ఛీ! సంసారదురాశ యే లుడుపవో? శ్రీ కాళహస్తీశ్వరా!

శ్లో. బద్ధ్వా గళే యమభటా బహు భర్త్సయన్తి
కర్షన్తి యత్రపథి పాశశతైర్యదా మామ్,
ఏకాకినం పరవశం చకితం దయాళో!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 14

ఏకాకిఁ, జకితుండ, నేఁ బరవశుఁడ
నెప్పుడు యమభటు లీడ్చి నన్ గట్టి
కొఱడాలఁ గొట్టుచున్ వెఱపు గొల్పెదరొ
దుష్టతం ద్రోవలోఁ ద్రోసి లాగెదరొ
అత్తఱిఁ గాపాడు మయ్య! దయాళు!
శ్రీ నృసింహా నాకుఁ జేయూఁత నిమ్మ.

టీ. శ్రీనృసింహా=ఓ నరసింహస్వామీ!, నేన్=నేను, ఏకాకిన్=ఒంటరివాఁడను, చకితుఁడన్=ఉన్నట్టుండి ఆశ్చర్యముపొందినవాఁడను, పరవశుఁడన్=విషయవాంఛలలో మునిఁగినవాఁడను, ఎప్పుడు=ఏ క్షణములో, నన్=నన్ను, ఈడ్చికట్టి=పడలాగి కాలుసేతులుగట్టి, కొఱడాలన్ కొట్టుచు=కొఱడాలతో మోఁదుచు, యమభటులు=యమధర్మరాజుబంట్లు, వెఱపున్ గొల్పెదరొ=భయము పుట్టింతురో! దుష్టతన్=క్రూరతను జూపుచు, త్రోవలోన్ త్రోసి=వీథిలోఁ బడఁద్రోసి, లాగెదరో=బడబడ నీడ్చెదరో, దయాళు=ఓ దయగల స్వామీ!, అత్తఱిన్ కాపాడుమయ్య=ఆ క్షణములో నన్ను ఆబాధనుండి రక్షింపుచు, నాకు, చేయూఁతనిమ్మ=చేయి అందిచ్చి ఆధారము కల్పింపుము.

తా. దయాళువగు శ్రీలక్ష్మీనరసింహమూర్తీ! విషయవాంఛలలో మునిఁగి, ఒంటరివగు నన్ను యమభటు లీడ్చికొనిపోయి, గుదికట్ల కొరడాలతోఁ గొట్టి భయముగొల్పెదరో, క్రూరులై నడువీథి బడబడలాగెదరో ఆక్షణమున నన్నుఁ గాపాడుము; నాకుఁ జేయూఁత నిమ్ము.

ఈఘట్టమున నరసింహశతక కారుఁడు చక్కనిపద్యము వ్రాసినాఁడు.

తుదకు కాలునియొద్ద దూతలిద్దఱు వచ్చి
గుంజుక చనివారు గ్రుద్దుచుండ
హింసకోర్వఁగలేక యేడ్చి గంతులువేసి
దిక్కులేదని నాల్గుదిశలుచూడఁ

దన్ను విడిపింపవచ్చెడు ధన్యుఁడెవఁడు
ముందె నీదాసుఁడైయున్న ముక్తిగలుగు
భూషణవికాస శ్రీ ధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఏడ్చి గంతులువేయుటలో తిన్నని హాస్యముకూడ నున్నది. ఆ క్షణమున కాపాడుమని శంకరాచార్యుఁడు వ్రాసినాఁడు.

భర్తృహరి భావ మదే భాగమున చూడుఁడు.

ధృతిగ్లాని రోగముల్ జరయు దేహమునొంపకమున్నె, యింద్రియ ప్రతిహతిలేకమున్నె, తన ప్రాణ విరామము కాకమున్నె, పండితజనుఁ డాదరింపఁదగు శివిఁ బ్రయత్నము ముక్తికిజీ: మహో ద్ధతశిఖి నిల్లుగాలుతఱిఁ దాలిమి నూఁతులు ద్రవ్వఁబొవ్వనే?

శ్లో. అంధస్య మే హృతవివేకమహాధనస్య
చోరై ర్మహాబలిభి రిన్ద్రియనామధేయైః,
మోహాన్ధకారకుహరే వినిపాతితస్య
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 15

అంధుండఁగాన మహాబలులైన
యింద్రియాహ్వాయచోరు లెందఱో దేవ!
నా వివేకమహాధనమ్ము హరించి

మోహాతిమిరబిలమ్మునఁ ద్రోసిరయ్యా!
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా = ఓ లక్ష్మీనరసింహస్వామీ!, దేవ = మహా ప్రభూ!, అంధుండన్ కాన = నేను జ్ఞానదృష్టి లేనివాఁడనగుటచే, మహాబలులైన = మిక్కిలి బలముగలిగిన, ఇంద్రియాహ్వయచోరులు = పంచేంద్రియములను దొంగలు, ఎందఱో = ఎంతోమంది, నావివేకధనమ్ము = నా విజ్ఞానమను ధనమును, హరించి = దొంగిలించి, మోహాతిమిర = మోహమను చీఁకటిగల బిలములో (కొండబిలములో), త్రోసిరయ్యా = పడఁద్రోసిరి తండ్రీ!, నాకు, చేయూఁతనిమ్ము = అట్టివానిని నన్ను రక్షింపుము.

తా. మహాప్రభూ! శ్రీలక్ష్మీనరసింహమూర్తీ! జ్ఞానదృష్టిలేని నన్ను అవయవములను మిక్కిలి బలముగలిగిన దొంగ లెందఱో నావిజ్ఞానధనమును దొంగిలించి, నన్ను కడకు మోహమను చీఁకటికోనయగు బిలమున పడఁద్రోసిరి. స్వామీ నామీఁద కృపాదృష్టిపఱపి రక్షింపుము.

శంకరాచార్యులు సంసారమునఁ బడి యింద్రియములు సూచించు కార్యము లొనరించువారు గ్రుడ్డివారని శివానందలహరిలోఁగూడ తెలిపినారు.

అసారే సంసారే నిజభజనదూరే౽ జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతు ముచితమ్.

శ్లో. లక్ష్మీపతే! కమలనాభ! సురేశ! విష్ణో!
యజ్ఞేశ! యజ్ఞ! మధుసూదన! విశ్వరూప!,
బ్రహ్మణ్య! కేశవ! జనార్దన! వాసుదేవ!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 16

శ్రీపతీ! ఓ విశ్వరూప! సురేశ!
బ్రహ్మణ్య! ఓ జనార్దన! వాసుదేవ!

మధుసూదనా! యజ్ఞ! మహితయజ్ఞేశ!
కేశవా! నిన్నెప్డుఁ గీర్తింతు మదిని
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్మ.

టీ. శ్రీనృసింహా = ఓ నరసింహస్వామీ, శ్రీపతి=లక్ష్మీదేవిభర్త, విశ్వరూప=సమస్తము తనరూపమైన దేవుఁడు, సురేశ=దేవతలకు ప్రభువు, బ్రహ్మణ్య = బ్రహ్మస్వరూపుఁడు, జనార్దన = ప్రళయకాలమున జనులను సంహరించువాఁడు, వాసుదేవ = వసుదేవుని కుమారుఁడు, మధుసూదనా= మధువను రాక్షసుని సంహరించినవాఁడు, యజ్ఞ=యజ్ఞస్వరూప!, మహిత యజ్ఞేశ = మహనీయమగు యజ్ఞముల ఫలప్రదాత! కేశవా! = శివతేజము బ్రహ్మతేజస్సును కలిగినవాఁడవగు, నిన్ను, మదిని = మనస్సులో, ఎప్పుడుఁ గీర్తింతును = ఎల్లప్పుడును పొగడుదును, నాకు, చేయూఁతనిమ్ము = రక్షకుఁడ వగుము.

తా. శ్రీనరసింహా! లక్ష్మీదేవికి భర్తవై, సమస్తస్వరూపుఁడవై, సురలకు నాయకుఁడవై, బ్రహ్మణ్యమూర్తివై, ప్రళయకాలమున మనుష్యులఁ జంపువాఁడవై, వాసుదేవుఁడవై, మధుఁడనురాక్షసునిఁ జంపినవాఁడవై, యజ్ఞస్వరూపుఁడవై, యజ్ఞఫలస్వరూపుఁడవై, శివబ్రహ్మతేజముల గర్భీకరించుకొనిన దేవుఁడవగు నిన్ను నామనస్సున సర్వదా భజింతును.

యజ్ఞములు భగవత్ప్రీతికరములైనను, జపయజ్ఞమే మేలని గీతలో పరమాత్ముఁడు చెప్పినాఁడు.

మహర్షీణాం భృగురహం
గిరామస్మ్యేక మక్షరం
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి
స్థావరాణాం హిమాలయః. —విభూతియోగము-25

శ్లో. ప్రహ్లాదనారదపరాశరపుణ్డరీక
వ్యాసామ్బరీషశుకశౌనకహృన్నివాస!,

భక్తానురక్త పరిపాలన పారిజాత!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 17

ప్రహ్లాద నారద వ్యాసాంబరీష.
శుక పుండరీక శౌనక పరాశర హృ
దంతర వాసుండవంచు – లక్ష్మీశ!
భక్తానురక్త సత్పరిపాలనమునఁ
బారిజాతమ వంచు భజియింతు నిన్ను
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ శ్రీనృసింహా=ఓ దేవా, లక్ష్మీశ=లక్ష్మీమనోహరా, నిన్నున్=నిన్ను, ప్రహ్లాద నారద వ్యాసాంబరీషశుక పుండరీక శౌనక పరాశరుల, హృదంతర వాసుఁడవంచున్=మానసములో వెలుఁగొందు దేవుఁడవని, భక్తానురక్త=భక్తుల కనుకూలమగు, సత్పరిపాలనమునన్=చక్కని పరిపాలనమున, పారిజాతమవంచున్ = అడిగిన ఫలములనొసంగు దేవలోకపుఁ బారిజాత పుష్పమ వనుచు, భజియింతున్=భక్తితోఁ గొలిచెదను, నాకు, చేయూఁత నిమ్ము = రక్షకుఁడ వగుము.

తా. శ్రీనృసింహమూర్తీ! లక్ష్మీమనోహరా! ప్రహ్లాదనారదవ్యాసాంబరీష శుకపుండరీక శౌనకపరాశరాదిమహాభక్తులమానసముల వెలుంగు దేవుఁడవని, భక్తుల కనుకూలముగా చల్లని ప్రభువువై అడిగిన ఫలములనన్నిటి నిచ్చెడి పారిజాతమవనుచు నిన్ను భజింతును. నాకు రక్షకుఁడవు కమ్ము.

శ్లో. ఏకేన చక్రమపరేణ కరేణ శఙ్ఖ
మన్యేన సిన్ధుతనయా మవలమ్బ్య తిష్ఠన్,
వామేతరేణ వరదాభయహస్తముద్రాం
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 18

ఒక్కచేతను జక్ర మొక్కండుఁదాల్చి
శంఖమ్ము నపరహస్తమున ధరించి
సింధుకన్య మఱొక్కచేతనుబట్టి
వామేతరంబున వరములొసంగు
నభయహస్తాంకంబు నావిష్కరించి
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా = ఓ లక్ష్మీనరసింహదేవా!, ఒక్కచేతను, చక్ర మొక్కండుఁ = ఒకచేతిలో చక్రాయుధము నొకటి, తాల్చి = పూని, అపరహస్తమునఁ = అవ్వలి చేతిలో, శంఖమ్ము ధరించి=శంఖమునుదాల్చి, మఱొక్కచేతను = ఇంకొకచేతిలో, సింధుకన్యను = లక్ష్మీదేవి (చిటికెన వ్రేలి)ని విలాసముగా, పట్టి=పట్టుకొని, వామేతరంబునఁ=కుడిప్రక్కన, అభయహస్తాంకంబు = అభయహస్తమును, ఆవిష్కరించి = కనఁబఱచి, వరములొసంగు = భక్తులకోర్కెలఁ దీర్చుదేవా!, నాకు, చేయూఁతనిమ్ము = నాకు ఆధార మొసఁగుము.

తా. చక్రాయుధ మొకచేతిలో, పాంచజన్యమను శంఖమును మఱియొకచేతిలో, వెంటవచ్చు లక్ష్మీదేవి చిటకెనవ్రేలిని విలాసముగా నొక చేతితోఁ బట్టుకొని, ప్రస్ఫుటముగా నభయహస్తమున వరములొసఁగు శ్రీ లక్ష్మీనరసింహమూర్తీ! నాకు రక్షనొసఁగుము.

శంకరాచార్యులు వర్ణించుటలో నొకహస్తమైన మన కభయ మొసఁగు నని వర్ణించినారు. పోతన కొంత భీకరముగా వర్ణించినారు.

శ్రీమహిళామహేశ సరసీరుహగర్భులకైన సీమహో
ద్దామకరంబుచే నభయదానము సేయవు; నేను బాలుఁడం
దామసవంశసంభవుఁడ, దైత్యుఁడ నుగ్రరజోగుణుండ, ని
స్సీమదయం గరాంబుజము శీర్షముఁజేర్చుటఁ జోద్యమీశ్వరా!

—సప్తమస్కంధము-359.

శ్లో. ఆద్యన్తశూన్య మజ మవ్యయ మప్రమేయ
మాదిత్యరుద్రనిగమాదినుతప్రభావమ్,
త్వాఽమ్భోధిజాస్యమధులోలుపమత్తభృఙ్గం
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 19

ఆద్యంతశూన్యంబు నప్రమేయంబు
అజము నవ్యయమును - ఆదిత్యరుద్ర
నిగమాదిసన్నుతమగు ప్రభావమ్ము-
ఇందిరాసుందరీసుందరవదన
మకరందలోలుపమత్తభృంగమ్ము-
నీవ యంచును గొల్తు నిత్యమ్ము దేవ!
శ్రీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. శ్రీనృసింహా! నీవు, ఆది + అంతశూన్యంబున్ = మొదలుఁ దుదయు లేనిదియు, అప్రమేయంబు = కొలఁతకు మీఱినదియు, అజము = పుట్టుక లేనిదియు, అవ్యయమును = నాశము లేనిదియు, ఆదిత్యరుద్ర నిగమ + ఆది సన్నుతమున్ = ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, చతుర్వేదములు మొదలగువారిచేఁ గీర్తింపఁబడునదియు, అగు, ప్రభావమ్ము = గొప్ప మహిమగలవాఁడవు, ఇందిరాసుందరీ = లక్ష్మీదేవియొక్క, సుందరవదన = (తామరపూవువంటి) సెమ్మొగమునందలి, మకరంద = పూఁదేనియ (అధరామృతము) యందు, లోలుప = ఆసక్తిగల, మత్తభృంగమ్ము = గండుతుమ్మెదవు, అనుచున్, నిత్యమ్మున్, కొల్తున్ = నిన్నుఁ బూజింతును, నాకున్, చేయూఁతన్ + ఇమ్ము = అండఁగా నుండుము.

తా. దేవా! తుదిమొదలు లేని నిర్గుణతత్త్వము, స్వయంప్రకాశము, ఎప్పుడు పుట్టినదో యెఱుఁగరాక అక్షీణమై వేదములచే సూర్యునిచే రుద్రునిచేఁ గొనియాడఁబడుచున్న తేజస్సును, సుందరమైన యిందిరాదేవి ముఖస్వారస్యములో మునిఁగి తేలు గండుతేఁటివి తమరేనని నిత్యము భజింతును. శ్రీనృసింహా! నాకుఁ జేయూఁతనిమ్ము.

ఇదే ఘట్టమున బమ్మెర పోతనగారు వచించిన వాక్యాలు:—

"పంచభూతతన్మాత్రంబులును, ప్రాణేంద్రియంబులును, మనో బుద్ధ్యహంకార చిత్తంబులును నీవ; సగుణంబును నిర్గుణంబును నీవ; గుణాభిమానులయిన జన్మమరణంబులొందు విబుధ లాద్యంతంబులుగానక నిరూపాధికుండవైన నిన్నెఱుంగరు; తత్త్వజ్ఞులయిన విద్వాంసులు వేదాధ్యయనాదివ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱిఁగి సేవింతురు."

—సప్తమస్కంధము, 866

శ్లో. వారాహ! రామ నరసింహ! రమాదికాన్తా
క్రీడావిలోల! విధిశూలిసురప్రవన్ద్య!
హంసాత్మకం పరమహంసవిహారలీలం
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 20

వారాహ! రామ! ఓ నారసింహాఖ్య!
శ్రీరమాదిప్రియాక్రీడావిలోల!
విధిచంద్రశేఖరవిబుధప్రవంద్య!
హంసాత్మకంబయి యలరారె దీవు;
పరమహంసవిహారవరలీలము నగు
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. వారాహ=వరాహరూప మెత్తిన స్వామీ!, రామా=రంజింపఁ జేయువాఁడా!, నారసింహాఖ్య=నరసింహమను పేరుగలవాఁడా! శ్రీరమాది = శోభతో వెలుఁగు లక్ష్మీదేవి భూదేవి నీళాదేవి మొదలుగాఁగల, ప్రియా = ప్రియురాండ్రతో, క్రీడావిలోల = కేళిలోఁ దేలు స్వామీ!, విధి =

బ్రహ్మచేత, చంద్రశేఖర=శివునిచేత, విబుధ = దేవతలచేత, ప్రవంద్య = నమస్కరింపఁబడు దేవా!, ఈవు=నీవు, హంసాత్మకంబయి=ప్రాణరూపం బవై, అలరారెదవు=వెలుఁగొందెదవు, పరమహంస=మహాయోగుల మానస ములలో, విహార=విహరించుటయందు, వరలీలమునగు=మిక్కిలి వేడుకగల, శ్రీనృసింహా = ఓ నరసింహస్వామీ!, నాకుఁ జేయూఁతనిమ్ము = నన్ను రక్షింపుము.

తా. శోభతో వెలుఁగు లక్ష్మీభూనీళాదిదేవచయముతో విహరిం చుచు, బ్రహ్మాదులచే నమస్కరింపఁబడుచు, పరమయోగుల మానససరోవర ముల హంసవలె క్రీడించుచునున్న నరసింహా! వరాహా! రామా! నాకు సాధారము గల్పింపుము.

హంస : యను పదమునసే వేదాంతము సూచింపఁబడుచున్నది.

హంసశబ్దమున కర్థము నానార్థ శివశతకమే తెలుపుచున్నది.

హంసయన విష్ణుపేరగు
హంసుండన సూర్యుఁ డగును నభవుండు నగుజా
హంసుఁడనంగను జీవుఁడు
హంసుండన యోగ్యుఁడైన యధిపుఁడు సాంబా!

తటస్థజ్ఞానము గలిగించు, హంసశబ్దమువలన స్వరూపజ్ఞానము తెలిసి కొనవలెను. ఇందులకు నా వాక్యములకంటె వివేకానందస్వాములవారు చిత్రించిన రామకృష్ణమతమువారి ముద్ర చూచినచో తెలియఁగలదు.

శ్లో. మాతా నృసింహశ్చ పితా నృసింహః
భ్రాతా నృసింహశ్చ సఖా నృసింహః,
విద్యా నృసింహో ద్రవిణం నృసింహః
స్వామీ నృసింహస్సకలం నృసింహః. 21

నరసింహుఁడే చూడ నాతల్లి యగును
నరసింహుఁడే చూడ నాతండ్రి యగును

నరసింహుఁడే చూడ నా భ్రాత యగును
నరసింహుఁడే చూడ నా సఖుఁ డగును
నరసింహుఁడే విద్య; నా స్వామి; ధనము;
నా సకలంబును నరసింహుఁ డగును
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. నరసింహుఁడే = శ్రీలక్ష్మీనృసింహస్వామియే, భ్రాతయగును = అన్నయగును, నా సఖుఁడగును = నా స్నేహితుఁడగును.

తా. శ్రీలక్ష్మీనృసింహమూర్తియే. నా తల్లి, తండ్రి, అన్న, తమ్ముఁడు, స్నేహితుఁడు, విద్య, ప్రభువు, ధనము,— వేయేల? నా సర్వస్వము ఆయనయే! అట్టిదేవా! నాకుఁ జేయూఁతగా నిల్చి రక్షింపుము.

సర్వము నృసింహరూపమే యని తనబుద్ధిని కేంద్రీకరించుకొనుచున్నాఁడు. స్తోత్రములలోని నిట్టి తాదాత్మ్యభావమే కవి చూపుచుండును.

శ్లో. మాతాచపార్వతీదేవీ పితాదేవోమహేశ్వరః
బాంధవాశ్శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయం.

ఈ స్తోత్రమునుబట్టియే కాఁబోలు "వల్లీసనాథ మమదేహికరావలంబమ్" అను మకుటముగల స్తోత్రము పుట్టినది.

ఈ భావమును మూకమహాకవి మఱింత సున్నితముగా నుంచెను— (ఆంధ్రీకరణము చూతము)

కర్మలు మండు టెండతఱి కాకలు కానవి యార్పు మంచులై
కూర్మి జడిన్ స్రవించు సుధ క్రొన్నదితుంపురులై దనర్చు నీ
నిర్మలమందహాసరుచినిస్తుల చంక్రమణమ్ములో దయా
ధర్మనిధీ! ననుం బుజముదట్టుత పాపభయంబు పాపుచున్.

—మందస్మితము-89.

శ్లో. ప్రహ్లాదమానససరోజవిహారభృఙ్గ
గఙ్గాతరఙ్గధవళాఙ్గ రమాస్థితాఙ్గ,
శృఙ్గారసఙ్గతకిరీటలసద్వరాఙ్గ
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలమ్బమ్. 22

ప్రహ్లాదమానసాబ్జవిహారభృంగ!
గంగాతరంగసితాంగ! అభంగ!
శృంగారసంగకిరీటవరాంగ!
శ్రీస్థితాంగ! నమస్కరించెద నీకు.
శ్రీ నృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

టీ. ప్రహ్లాద = ప్రహ్లాదునియొక్క, మానసాబ్జ = మనస్సు అను తామరపూవునందు, విహార = విహరించు, భృంగ = మధుపమా!, గంగాతరంగ = గంగానది అలలవలె, సితాంగ = తెల్లని దేహము గలవాఁడా! అభంగ = ఆటంకము ఎఱుఁగనివాఁడా!, శృంగార = చక్కఁదనముచేత, సంగ = ఒప్పిన, కిరీట = కిరీటముగల, వరాంగ = శిరస్సుగలవాఁడా!, శ్రీస్థితాంగ = లక్ష్మీదేవితోఁ గూడుకొనియుండువాఁడా!, నీకు, నమస్కరించెద = నమస్కారము చేయుదును.

తా. మహాభక్తుఁడగు ప్రహ్లాదుని మనస్సు అను తామరపూవులో విహరించు తేఁటివంటిస్వామీ! గంగానదీతరంగములవలె తెల్లనిదేహముగల దేవా! నిరాటంకమగు శక్తిగల తండ్రీ! శోభచే వెలుఁగు కిరీటము శిరస్సున ధరించిన దేవా! లక్ష్మీదేవికనుసన్నలమెలఁగు స్వామీ! నీకు నమస్కారము.

"గంగాతరంగసితాంగ"—'విష్ణువు, కృష్ణమూర్తి (నల్లని యాకృతి గలవాఁడు) అనిగదా లోకవిదితము - మఱి, గంగాతరంగములవలెఁ దెల్లని యవయవములు గలవాఁడనుట యెట్లు పొసఁగును?' అను సందియము కలు

గక పోదు. ప్రకృతవర్ణనీయము నరసింహమూర్తి. సింహము శ్వేతవర్ణము కలది యనుట ప్రసిద్ధమే కదా! అందువలననే నరసింహుఁడు 'గంగాతరంగ సితాంగుఁడు' అని సమాధానము చెప్పుకొనవలసియుండును.

శ్లో. శ్రీశఙ్కరార్యరచితం సతతం మనుష్య
స్తోత్రం పఠే దిహ తు సర్వగుణప్రసన్నమ్,
సద్యో విముక్తకలుషో మునివర్యగణ్యో
లక్ష్మీపతేః పద ముపైతి స నిర్మలాత్మా. 23

సర్వోత్తమ గుణప్రసన్నంబు,— నరయ
శ్రీశంకరార్య రచితమగు స్తోత్ర
మెవ్వాఁడు పఠియించు నిహమున సతము
అతఁడు తత్క్షణమ సర్వాఘంబు లుడిగి
మునివర్య గణ్యుండు, పూతాత్ముఁ డగుచు
శ్రీపతిస్థానంబు చేరు నృసింహ!

టీ. నృసింహ = శ్రీ నరసింహస్వామీ!, అరయఁగ=విచారింపఁగా, సర్వోత్తమ = అన్నిటికంటె మేలైన, గుణ=సుగుణములచేత, ప్రసన్నంబు = పవిత్రమైనదియు, శ్రీశంకరార్య=శ్రీశంకరాచార్యులచేత, రచితమగు = వ్రాయఁబడిన, స్తోత్రమును = భక్తితో పొగడు పద్యములను, సతము = ఎల్లప్పుడు, ఎవ్వాఁడు పఠియించుఁగ = ఎవఁడు భక్తితోఁ జదువునో, అతఁడు = వాఁడు, ఇహమునఁగ=ఈ లోకమున, తత్క్షణము=ఆ నిముసమునసే, సర్వాఘంబు లుడిగి = పాపములన్నిటినుండి తొలఁగి, మునివర గణ్యుండు = మునులచేఁ బొగడఁదగినవాఁడై, పూతాత్ముఁడగుచుఁగ=పవిత్రమైన ఆత్మగలవాఁడై, శ్రీపతిస్థానంబుఁగ = వైకుంఠమును, చేరుఁగ = చేరును.

తా. అన్నిటికంటె మేలైన సుగుణములచే లలితముగా శ్రీశంకరాచార్యులు వ్రాసిన ఈ లక్ష్మీనృసింహస్తోత్రమును ఎల్లప్పుడును భక్తితో నెవ్వఁడు పఠించునో అతఁ డీలోకమున పాపములన్నిటి విడనాడి మునులు మెచ్చుకొను పవిత్రుఁడై వైకుంఠమును జేరును.

శ్లో. యన్మాయయార్జితవపుః ప్రచురప్రవాహ
మగ్నార్తమర్త్యనివహేషు కరావలమ్బమ్,
లక్ష్మీనృసింహచరణాబ్జమధువ్రతేన
స్తోత్రం కృతం శుభకరం భువి శఙ్కరేణ. 24

ఏ స్తోత్రమెన్నంగ నీ భువిలోన
మాయార్జితశరీరభూయఃప్రవాహ
మగ్నార్తమర్త్యసంహతికిఁ జేయూఁత;
ఆ శుభంకరమగు నట్టి స్తోత్రంబు
శ్రీనృసింహపదకుశేశయభృంగ
మగు జ్ఞాని శ్రీ శంకరార్యుండు వ్రాసె.

టీ. ఏస్తోత్రము = ఏ పవిత్రమైన స్తుతి, ఎన్నంగ = చెప్పుకొనఁదగినట్లుగా, ఈ భువిలోన = ఈ ప్రపంచములో, మాయార్జిత = మాయచేత నేర్పడిన, శరీర = అనేక శరీరములు (జన్మలు) పొందుట అనెడు, భూయః = గొప్పదైన, ప్రవాహ = వెల్లువయందు, మగ్న = మునిఁగి, ఆర్త = కష్టపడు, మర్త్య = మనుజులయొక్క, సంహతికిన్ = సమూహములకు, చేయూఁత = పట్టుకొమ్మగా నున్నదో, ఆ శుభంకరమగునట్టి స్తోత్రము = ఆ మంగళకరమగునట్టి స్తుతిని, శ్రీనృసింహ = ఆ లక్ష్మీనరసింహదేవునియొక్క, పదకుశేశయ = పాదపద్మములనంటి విహరించు, భృంగమగు = తేనెటీఁగవంటివాఁడైన, జ్ఞాని = యోగియగు, శ్రీశంకరార్యుండు = శ్రీశంకరాచార్యుఁడు, వ్రాసెన్ = వ్రాసెను.

తా. మాయచే నిండి జననమరణప్రవాహమున మునిఁగి కష్టపడు మనుజసంతతికి ఈ భూమిమీఁద నొకపట్టుకొమ్మయై, శుభములొసఁగు ఈ స్తోత్రమును లక్ష్మీనృసింహపాదములనే నిరంతరము స్మరించుకొను జ్ఞానియగు శ్రీ శంకరాచార్యుఁడు వ్రాసెను.

శ్లో. శ్రీమన్నృసింహ విభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ,
తృష్ణాదివృశ్చికజలాగ్నిభుజఙ్గరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే. 25

శ్రీమన్నృసింహ! సంసృతి కౌషధమవు;
తాపత్రయంబులఁ బాపెద వీవు;
ద్రవిణుండవు; గరుడ ధ్వజుఁడవు నీవు;
తృష్ణాదిజలవహ్ని వృశ్చికభుజగ
భయరోగపీడలం బాఱఁద్రోలెదవు
హరుఁడవు; గురుఁడవు – వరనతుల్ నీకు.

టీ. శ్రీమన్నృసింహ = శుభములొసంగు ఓ లక్ష్మీనరసింహస్వామీ!, సంసృతికౌషధమవు = సంసారబాధలను పోఁగొట్టుమందువు, ఈవు=నీవు, తాపత్రయంబులన్ = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములవలన నేర్పడు చిత్తశ్రమలను, పాపెదవు = పోఁగొట్టెదవు, ద్రవిణుఁడవు = శ్రీనివాసుఁడవు, గరుడధ్వజుఁడవు=గరుడుని కేతనమునందుఁ గలవాఁడవు, తృష్ణాది= ఆఁకలిదప్పులు మొదలగాఁగల, జల = నీటివలన, వహ్ని = నిప్పువలన, వృశ్చిక = తేళ్లవలన, భుజగ = పాములవలన, భయరోగ = భయమువలనను రోగమువలనఁ గలుగు, పీడలన్=శ్రమలను, పాఱఁద్రోలెదవు=పోఁగొట్టె దవు, హరుఁడవు = సర్వపాపములను హరించువాఁడవు, గురుఁడవు = సమస్త జనులకు తండ్రివంటివాఁడవు, నీకు, వరనతుల్=నమస్కారములు (చేయుచున్నాఁడను).

తా. ఓ లక్ష్మీనృసింహమూర్తీ! నీవు సంసారబాధలఁ బోఁగొట్టు మందువు; తాపములన్నిటిని పోఁగొట్టెదవు; శ్రీనివాసుఁడవు; గరుడధ్వజుఁడవు; ఆఁకలిదప్పులు, నీరు, నిప్పు, తేళ్లు, పాములవలన ఏర్పడు భయములను, రోగములను ఇతరక్లేశములను పోఁగొట్టెదవు; సమస్తజనుల పాపములను హరించు తండ్రివి—నీకు నమస్కరించుచున్నాను.

నృసింహపురాణము రచించిన ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహావతారఘట్టమున ఫలశ్రుతి వినిపించినాఁడు.

> భాసురభాను భానునిభ భావిభవుం గరుడాద్రిదివ్యసిం
> హాసను, నన్ను, నున్నతదయార్ద్రు; నహోబలతీర్థనాథు; ల
> క్ష్మీసముపేతుఁ; జారునరసింహశరీరు భజించు నుత్తముల్
> వేసకలార్థసార్థసుఖవీథులఁ గ్రాలుదు రెల్లకాలమున్.
>
> (5—163)

పోతన ఫలశ్రుతి వినిపించినాఁడు.

> శ్రీరమణీయమైన నరసింహవిచారము; నింద్రశత్రుసం
> హారముఁ; బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథపుత్రసం
> చారము నెవ్వఁడైన సువిచారత విన్న పఠించినన్ శుభా
> కారముతోడనే భయముగల్గని లోకముఁజెందు భూవరా!
>
> (7—385)

కాని యీ స్తోత్రములే సాయుజ్యముకూర్చునను భావము కొంత మంది కవులకు లేనట్లు తోఁచుచున్నది. విశ్వసౌందర్యమున కుపాధులైన నామరూపములలో నామప్రాబల్యము తెలుపు ఈ స్తోత్రములేపాటి—

> చెలువగు తేటమాటలను చిత్రసమొల్కు కవిప్రభుండు తా
> జలజభవుండు; రూపములఁ జక్కఁదనంబున నాత్మవిద్య దాఁ
> జలిపెడి శిల్పి విష్ణు : పతిధీరగభీరమనోవిశాలతన్
> నిలిచిన యోగి యీశ్వరుఁడు నిక్కమువీరలు భావసంపదన్.

విశ్వసౌందర్యరాశి నావిర్భవించి
నామరూపముల్ మదికి నెన్నంగఁ దోఁచి
పరమమహితార్థ భావసంపదల నీని,
విశ్వసౌందర్యరాశిలోఁ బ్రీతి నణఁగు

కవియగు నామోపాసన జీవుకని స్వరూపనిష్ఠ శిల్పీంద్రుండౌ
ప్రవిమలశివసుందరతం దవిలినయోగీంద్రు డౌను ధ్యానాసక్తిన్.
(నా 'శిల్పి' శీర్షికనుండి)

కాన శివయోగియగు ధూర్జటి కాళహస్తిశతకములో—

ఏలీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీరూపముం
జాలుంజాలుఁ గవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా!

ఇదే భావము లక్ష్మీశృంగారకుసుమమంజరి వ్రాసిన శ్రీమత్పరమహంస పరిపూర్ణానందనాథులకు కలదు—

శ్రుత్యంతమ్ములు వేదశాస్త్రములు సంశోధింప మాద్యద్రస
ప్రత్యగ్రమ్ములు నవ్యకావ్యములు నారంజూడ; వాచాలతా
కృత్యం బియ్యది సైఁపఁగావలయుఁ దల్లీ! త్వత్ప్రసాదాకృతి
స్తుత్యశ్లాఘనవీటిగంధలవమా స్తోత్రమ్ము సర్వేశ్వరీ!

'కొలకుల' సద్వంశ కలశవారాశి
రాకావిధుండు నారాయణరావు
విబుధమాన్యుండు 'సావిత్రీ' కళత్రుఁ
డాంధ్రీకరించె ని ట్లత్యంతభక్తి
శంకరాచార్యుని సంస్కృత కృతిని.

టీ. శంకరాచార్యుని = శ్రీశంకరాచార్యులు వ్రాసిన, సంస్కృత కృతిని = సంస్కృత స్తోత్రమును, అత్యంతభక్తిన్ = మిక్కిలి భక్తితో, కొలకులసద్వంశ = 'కొలకుల' వంశమను, కలశ వారాశి = పాలసముద్రములోఁ బుట్టిన, రాకావిధుండు=పూర్ణిమాచంద్రుఁడును, విబుధమాన్యుఁడు = విజ్ఞానులచే గౌరవింపఁబడువాఁడును, సావిత్రీకళత్రుఁడు = సావిత్రి భర్తయు నగు, నారాయణరావు, ఆంధ్రీకరించెన్ = తెనుఁగు చేసెను.

తా. శ్రీశంకరాచార్యులు వ్రాసిన యీ సంస్కృత స్తోత్రమును కొలకులవంశమను పాలసముద్రమునఁ బుట్టిన నిండుచంద్రుఁడును, విజ్ఞానులచే గౌరవింపఁబడువాఁడును, శ్రీమద్రామాయణమును గద్యరూపమున రచించిన సావిత్రి భర్తయగు నారాయణరావు మిక్కిలి భక్తితో తెనిఁగించెను.